





**శ్రీమతే రామానుజాయ నమః**

# కామాసికాష్టకమ్

శ్రీలక్ష్మీనరసింహస్వామి, తిరు వేళుక్కై




'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అழగ శింగరాచార్యులు


**సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు**

# కామాసికాష్టకమ్

**అవతారిక:**

ఈ స్తుతి కంచిలోని వేగవతీనదికి దక్షిణదిశలో వేంచేసి ఉండే నరసింహస్వామిని ఉద్దేశించినది. ఈ భగవానుడు తన సంకల్పంతో వేంచేసి ఉండే సన్నివేశాన్ని కీర్తిస్తూ రచింపబడిన శ్లోకాలు 8 ఇందులో ఉన్నందున కామాసికాష్టకమనే పేరు ఈ స్తోత్రానికి వచ్చింది. కామ–తన సంకల్పంతో, భగవానుడు, అసిక–వేంచేసి ఉండే సన్నివేశాన్నిగూర్చిన ఎనిమిది శ్లోకాలను కలిగినది –అని కామాసికాష్టకపదానికి అర్థం. ఈ దివ్యదేశాన్ని ఆళ్వారులు "వేళుక్కై"అనే పేరుతో నిర్దేశించారు. (వేళ్ –సంకల్పంతో, ఇరుక్కై–ఉండే స్థితి "వేళిరుక్కై. అదే క్రమంగా " వేళుక్కై " అని మారింది).

ఈ స్తుతిలో దేశికులు –ఉపనిషత్తులు కీర్తించే పరమపురుషుడే ఇక్కడ నరసింహస్వామిగా అవతరించడం, ఇతడు మూడు కన్నులను కలిగి ఉండడం, వైకుంఠంలో కంటే ఇక్కడ స్వామి ఎక్కువ ఆదరాన్ని కలిగి ఉండడం, పర్యంకబంధమనే ఆసనంలో, యోగదశలోవేంచేసి ఉండడం, శత్రువులను నిర్జించడంలో, భక్తులను కాపాడడంలో ఈ భగవానుని బాహువులకు ఉండే. త్వర, ఒకే సమయంలో ఇతడు హిరణ్యకశిపునకు భయంకరుడుగా, ప్రహ్లాదునకు సౌమ్యుడుగా ఉండడం, ఇతడే సర్వరక్షకుడై ఉండడం –అనే విషయాలను తెలియజేసి, ఈ స్తుతి అన్ని ఫలాలను ఇస్తుందని అంటూ దేశికులు స్తుతిపరిసమాప్తిని చేశారు.

కామాసికాష్టకమ్

శ్రీమాన్వేఙ్కటనాథార్యః కవితార్కిక కేసరీ

వేదాన్తాచార్య వర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥

# కామాసికాష్టకమ్

శ్రుతీనాముత్తరం భాగం వేగవత్యాశ్చ దక్షిణమ్,
కామాదధివసఞ్జీయాత్కశ్చిదద్భుత కేసరీ ॥1 ॥

శ్రుతులకు ఉత్తరభాగంలోను(వేదాంతాలలోను), వేగవతీనదికి దక్షిణభాగంలోను వేంచేసి ఉండేవాడు, సాటి లేని, అద్భుతమైన నృసింహరూపాన్ని పరిగ్రహించినవాడైన స్వామి సదా వర్ధిల్లాలి

తపనేన్ద్వగ్నినయనః తాపానపచినోతు నః తాపనీయ
రహస్యానాం సారః కామాసికా హరిః ॥2 ॥

సూర్యుడు, చంద్రుడు, అగ్ని –అనే ముగ్గురిని నేత్రాలుగా కలవాడు, నృసింహతాపి న్యుపనిషత్తులోని సారార్థమై ఉండేవాడైన కామాసికా నృసింహుడు మన తాపాలను తీర్చాలి.

ఆకణ్ఠమాదిపురుషం కణ్ఠీరవముపరికుణ్ఠితారాతిమ్,
వేగోపకణ్ఠసఙ్గాద్విముక్తవైకుణ్ఠబహుమతిముపాసే ॥3॥

కంఠంవరకు పురాణపురుషుని రూపాన్ని కలవాడు, ఆపైన సింహరూపాన్ని కలవాడు, శత్రువులను వధించేవాడు, వేగవతీనదికి దగ్గరలో ఉండే ప్రదేశంలో గల ఆశతో వైకుంఠంలో ఆదరాన్ని తక్కువగా కలవాడైన నృసింహస్వామిని ఉపాసిస్తున్నాను.

కామాసికాష్టకమ్

బన్ధుమఖిలస్యజన్తోః బన్ధురపర్యఙ్కబన్ధరమణీయమ్
,విషమవిలోచనమీడే వేగవతీపులినకేలినరసింహమ్॥4॥

సకలప్రాణులకు బంధువు, దృఢమైన పర్యంకబంధమనే ఆసనంలో అందంగా వేంచేసి ఉండేవాడు, విషమసంఖ్యలో మూడు కన్నులను కలవాడు, వేగవతీనది తీరంలోని ఇసుకతిన్నెలో క్రీడించేవాడు (వేంచేసి ఉండేవాడు)అయిన నృసింహస్వామిని స్తుతిస్తున్నాను.

స్వస్థానేషు మరుద్గణాన్నియమయన్స్వాధీనసర్వేన్ద్రియః,
పర్యఙ్కస్థిరధారణా ప్రకటితప్రత్యుఙ్ముఖావస్థితిః ।
ప్రాయేణ ప్రణిపేదుషః ప్రభురసౌయోగంనిజం శిక్షయన్,
కామానాతనుతాదశేషజగతాం కామాసికాకేసరీ ॥5 ॥

మరుద్గణాలను(దేవతలను)వారి వారి స్థానాలలో నిలిపి, తన ఇంద్రియాలను తన వశంలో కలవాడై, పర్యంకబంధమనే ఆసనంలో స్థిరంగా వేంచేసి ఉండడంవల్ల పడమరముఖంగా(అంతర్ముఖుడుగా) ఉండేవాడు, తనను ఆశ్రయించినవారికి తననుగూర్చిన ధ్యానాన్ని కల్పించేవానివలె ఉండే ప్రభువైన ఈ కామాసికాహరి లోకాలన్నిటికి అభీష్టఫలాలను అనుగ్రహించాలి.

వికస్వర నఖ స్వరు క్షత హిరణ్య వక్షః స్థలీ
నిరర్గలవినిర్గలద్రుధిరసిన్ధుసన్ధ్యాయితాః ।
అవన్తు మదనాసికా మనుజపఞ్చ వక్త్రస్య మామహం
ప్రథమికా మిథః ప్రకటితాహవా బాహవః ॥6 ॥

విచ్చుకొన్న గోళ్ళు అనే వజ్రాయుధాలతో బ్రద్దలు చేసిన హిరణ్యకశిపుని హృదయంనుండి నిరంతరంగా కారే రక్తప్రవాహంతో సంధ్యాకాలంవలె అయినవి,

### కామాసికాష్టకమ్

"నేను ముందు నేను ముందు" అని పోటీపడినందున తమ మధ్య పోరును వ్యక్తం చేసినవి అయిన కామాసికానరసింహుని బాహువులు నన్ను కాపాడాలి.

సటాపటలభీషణే సరభసాట్టహాసోద్భటే
స్ఫురత్క్రుధి పరిస్ఫుటద్భ్రుకుటికేऽపి వక్త్రేకృతే ।
కృపాకపటకేసరిన్ దనుజడిమ్భదత్తస్తనా
సరోజసదృశా దృశా వ్యతివిషజ్యతే వ్యజ్యతే ॥7 ॥

మాయానృసింహరూపాన్ని కలవాడా! నీ ముఖం సటాపటలంతో (జూలుతో) భయంకరంగా ఉన్నా, నీవు వేగంగా చేసిన పెద్ద వికటమైన అట్టహాసం ఉగ్రమై ఉన్నా. నీ, కనుబొమలు మిక్కిలిగా చలిస్తూ ఉన్నా, నీలో తీవ్రమైన కోపం వ్యక్తం అయినా, నీ కరుణ తామరపూవువంటి నేత్రంతో ప్రహ్లాదునకు స్తన్యాన్ని ఇచ్చి(అనుగ్రహించి అతనికి)విచిత్రమైన చికిత్సను చేయడం వ్యక్తం చేసింది. (ఒకే సమయంలో నీవు హిరణ్యునకు నిగ్రహాన్ని, ప్రహ్లాదునకు అనుగ్రహాన్ని చూపావు).

త్వయిరక్షతి రక్షకైః కిమన్యైస్త్వయి చారక్షతి రక్షకైః కిమన్యైః ।
ఇతి నిశ్చితధీః శ్రయామి నిత్యం నృహరే వేగవతీ తటాయం త్వామ్ ॥8 ॥

"నరసింహస్వామీ!నీవు రక్షించేటపుడు ఇతరరక్షకులతో ఏమి పని?నీవు రక్షించకపోతే, అన్యరక్షకులతో ఏమి ప్రయోజనం? "అని స్థిరమైన నిశ్చయాన్ని కల నేను వేగవతీనదీతీరంలో వేంచేసి ఉండే నరసింహభగవానుని ఆశ్రయించాను.

ఇత్థం స్తుతఃసకృదిహాష్టభిరేష పద్యైః శ్రీవేఙ్కటేశ రచితైస్త్రిదశేన్ద్ర వన్ద్యః । ॥
దుర్దాన్తఘోరదురితద్విరదేన్ద్ర భేదీ కామాసికానరహరిర్వితనోతు కామాన్ ॥9 ॥

## కామాసికాష్టకమ్

నియంత్రించడానికి వీలు కాని పాపాలనే గొప్ప ఏనుగులను భేదించేవాడు(పోగొట్టేవాడు), గొప్ప గొప్ప దేవతలచే నమస్కరింపబడేవాడైన ఈ కామాసికానృసింహుడు వేంకటేశకవిచే రచింపబడిన, ఎనిమిది శ్లోకాలతో ఈ విధంగా ఒకసారి ఈ లోకంలో స్తుతింపబడినవాడై, కోరిన ఫలాలను ఇచ్చేవాడుగా కావాలి. (ఈ స్తుతిని పఠించేవారికి కామాసికానృసింహుడు అభీష్టాలను ఇస్తాడు).

కామాసికాష్టకం సంపూర్ణమ్

★★★★★